# విషయ సూచిక

విద్య యొసగును వినయంబు
వినయమునను బడయుఁ బాత్రత
పాత్రతవలన ధనము
ధనము వలనను ధర్మంబు
దానివలన నైహికాముష్మిక సుఖంబు
లందునరుడు.



# మనుష్యుడు

ఈ రెంటిలో

౧. విద్య వచ్చిన వాడు మనుష్యుడు.

౨. మంచి చెడ్డల తారతమ్యమెఱిగి వర్తించుకొనువాడు మనుష్యుడు.

౩. స్వేచ్ఛ, స్వాతంత్ర్యము, వ్యక్తిత్వము, గౌరవము, కోరు వాడు మనుష్యుడు.

౪. తనకు కేమైనకష్టము లుండిన నితరులతో చెప్పికొని సాధించు కొనువాడు మనుష్యుడు. ('అడుగనిది అమ్మైన నను పెట్టదు' అని లోక వాడుక)

౫. బుద్ధిగలిగి దానితో పనితీసికొను వాడు మనుష్యుడు.

షరా:— ఈ రెండు వర్గములలో మీ కేది యిష్టమో ఆలోచించి నిర్ణయించు కొనగలరు.

## పశువు

తారతమ్యము.

౧. విద్య రాని వాడు పశువు (విద్యా విహీనః పశుః అని చెప్పినారు పెద్దలు)

౨. మంచి చెడ్డల తారతమ్యము లేనిది పశువు.

౩. ఎవరెట్లు తోలిన నట్లు పోవునది పశువు ('కళ్లు మూసుకొనిదో బత్తివానిది' అని సామెత)

౪. పశువునకు నోరు లేదు. చెప్పుకొనలేదు.

౫. పశువునకు బుద్ధిలేదు. కావుననే బుద్ధిలేని మనుష్యులను గాడిదా! దున్నపోతా! పసరమా! అనితిట్టుట వాడుచుందుము.

# చావు.

"జాతస్య మరణం ధృవమ్" పుట్టిన వారికందరకును చావు తప్పదు. కాని యకాలమరణమునకు మూలకారణము. పరిశుభ్రత లేక అజ్ఞానము.

అజ్ఞానము వలన
దారిద్ర్యము సంభవించును.
దారిద్ర్యమునుండి
మురికి(దురాచారములు) ప్రారంభమగును.
మురికి వలన
జాడ్యములు ఉత్పత్తియగును
జాడ్యములవలన
చావు త్వరగా సంభవించును.

అజ్ఞానము, దారిద్ర్యము, మురికి, జాడ్యము— వీని తప్పించుకొనుట యెట్లు— ఇవివరుసగా వ్రాయుచున్నాను. గమనించుడు.

# విద్య

౧. అజ్ఞానమునకు మందు విద్య.

౨. శిశువునకు అన్నమెట్లవసరమో మెదడునకు విద్య అట్లవసరము.

౩. మగవారికెంత విద్య కావలెనో అంత విద్య ఆడవారికి కావలెను.

౪. ఆడ పిల్లలకు విద్యవచ్చిన వారిపిల్లలకు కూడ విద్య వచ్చి తీరును.

౫. ద్రవ్యవంతులు విద్యాదానమునకై ద్రవ్యము ఖర్చుపెట్ట వలెను.

౬. బీదవారికి, కూలినాలి చేసికొను వారికి, రాత్రి పాఠశాలలు పెట్టి చదివించ వలెను.

౭. ప్రతి బాలికకు, ప్రతిబాలునికి, కనిష్ఠము ఈ క్రింది విషయములైనను తెలిసియుండవలెను: —

(అ) భూగోళము

(ఆ) దేశచరిత్ర—ప్రపంచ చరిత్ర.

(ఇ) లెక్కలు

(ఈ) మతవిద్య

(ఉ) పత్రికలు చదివి అర్థము చేసికొనుట.

ఇవి రానివాడు ప్రపంచ జ్ఞానములేనివాడు అనిపించుకొనును.

౮. గ్రంథాలయములు—వాచనాలయములు ప్రతి గ్రామమున నుండవలెను.

అవిద్య—అంధకారము

రెండును కవల పిల్లలు.



# సంపద

౧. దారిద్ర్యమునకు మందు వ్యవసాయము, చేతిపనులు.

౨. వ్యవసాయాభివృద్ధికై

(అ) వ్యవసాయ శాస్త్రముల చదువుడు.

(ఆ) మీపిల్లలకు వ్యవసాయ విద్య చెప్పించుడు.

(ఇ) ఎరువులను భూమికి పెట్టుడు.
పిడకలకై పేడను వ్యర్థము చేయకూడదు.

(ఈ) భూమి దున్నుటకు, పాయుటకు, నేర్పైన పని ముట్లను వాడుడు.

(ఉ) మీకు తెలియని సంగతులను గాని, క్రొత్త పని ముట్లకుగాని, ఎరువులకుగాని, పైరుల రోగములకు మందులకు గాని, హైద్రాబాదులో వ్యవసాయ శాఖాధ్యక్షునికి వ్రాసి తెలిసి కొనుడు.

3. చేతిపనులలో వీనిని వృద్ధిచేసికొనవచ్చును:—

(అ) రాటము వడకుట, మగ్గములపై నేయుట

(ఇ) వడ్రంగిపని, కమ్మరిపనిని వృద్ధిచేయుట

(ఈ) పెద్దపెద్ద బావులకు మిషనుపంపుల పెట్టుట

(ఉ) కోళ్లు, మేకలు, పెంచుట వృద్ధిపఱచుట

(ఊ) తోటలుపెంచి పండ్లను నగరమునకు ఎగుమతి చేయుట.

ఈ విషయములను వృద్ధిచేసికొనగోరువారు హైదరాబాదులోని పరిశ్రమల శాఖాధ్యక్షునికి వ్రాసిన వెంటనే సహాయము చేయబడును.



# పరిశుభ్రత

౧. పరిశుభ్రత యుండినచోట దేవుడుండును. మురికియుండిన చోట "మారి" (మృత్యుదేవత) యుండును.

౨. పరిశుభ్రత రెండు విధములు:—

(౧) వ్యక్తి పరిశుభ్రత
(౨) గ్రామ పారిశుధ్యత

౩. వ్యక్తి పరిశుభ్రత అనగా ప్రతివాడును స్వయముగా పరిశుభ్రముగా నుండుట.

౪. గ్రామ పారిశుధ్యత యనగా గ్రామము లోని వీధులను, బావులను, యిండ్లను, చుట్టుపట్టులను పరిశుభ్రముగా నుంచుట.

౫. నీవు మురికివాడవైన నీకేనష్టము. నీగ్రామము మురికి దైన నీ కుటుంబమున కంతయు నష్టము. ఈ రెంటిని లేకుండునట్లుగా చేసికొనుటెట్లు?

ముందు చూడుడు.

# వ్యక్తి పరిశుభ్రత

౧. మనకు మూడు వస్తువులు ముఖ్యము.

[అ] గాలి

[ఆ] నీరు

[ఇ] అన్నము

౨. ఈమూటిలో గాలి అవసరము లేదని మన గ్రామజనులు అనుకొనుచున్నారు. కావుననే వారియిండ్లకుకిటికీలుండవు. వారి యిండ్లలో వారితో బాటు పశువులు కూడ సంసారము చేయు చున్నవి. ఇదితప్పు. చెడ్డగాలి పీల్చిన ఆయుస్సు తగ్గిపోవును. వీలున్నంత వఱకు సాయంకాల మందు బయలులలో సంచారము చేయవలెను. స్త్రీలను "గోషా" లోపెట్టువారు తమస్త్రీలను సాయంకాలమందు పొలములందు కొంతసేపు త్రిప్పవలెను. ఇండ్లకు ౭ అడుగుల తలుపులును, ౫ అడుగుల కిటికీలును, పెట్టవలెను. వెలుతురు, గాలి, బాగుగా రావలెను. పశువుల నిండ్లలో కట్టివేసిన దుర్వాసన, ఈగలు, దోమలు పుట్టుట సంభవించును.

౩. మురికినీరు త్రాగుటచే

(అ) నారిపుండ్లు

(ఆ) జ్వరములు

(ఇ) గత్తర (కలరా లేక వాంతి)

(ఈ) చర్మరోగములు

సంభవించును.

కావున మీరు నీటిని బాగుగా కాచి చల్లారిన తర్వాత త్రాగవలెను.

౪. అధికముగా తినుట అజీర్ణమునకు హేతువు. ఇంపగు పదార్థములును, బలమునిచ్చు పదార్థములును, ముఖ్యముగా పండ్లను భుజింప వలెను.

౫. పరిశుభ్రముగా నుండవలె నని నీ క్రిందివి అలవాటు చేసికొనుము.

(అ) ప్రతి దినము స్నానము చేయుము.

(ఆ) బట్టల శుభ్రముగా నుంచుము. వీలైన ప్రతి దినము నుదుకు కొనుము.

(ఇ) నీయింటిని, నీయింటిచుట్టును మురికికి చేరనీయకుము.

(ఈ) నీ యన్నముపై ఈగల వాలనీయకుము. దుమ్ముపడ కుండునట్లుగా మూసి యుంచుము.

(ఉ) త్రికరణశుద్ధిగా (అనగా మనో, వాక్, కాయ, కర్మ ములందు) పరిశుద్ధుడవుగా నుండుము.

(ఊ) కల్లు, సారాయి, నల్లమందు, బ్రాండీ, చుట్ట, బీడీ, సిగరెట్లు మున్నగు మత్తు పదార్థములను వాడకుము. అలవాటుండిన వెంటనే యొట్టు పెట్టుకొని వదలి-పెట్టుము.

(ఎ) సంఘము యొక్క దృష్టిలో నీతి బాహ్యమైనట్టియు, గౌరవలోప మైనట్టియు, పనులను చేయవద్దు.

# గ్రామ పారిశుధ్యత

మీ గ్రామములో మాటికి యెక్కువైన కలరా పుట్టును. అది తెలియక మీరు మారెమ్మను జేసి దున్నపోతుల గొట్టుదురు. మేకలమెడలు విరుతురు. మంత్రాలు చదువుదురు. జంతాలు చేయింతురు. నిమ్మకాయల కోయుదురు. టెంకాయలు కొట్టుదురు. ఏమిచేసినను లాభములేదు. కావున నీక్రింది సందుల గమనింపుడు. ఇంతకన్న మించిన మంత్రమింకొకటిలేదు.

౧. గ్రామములో బజారులు, సందులుగొందులు, అన్నియు బాగుగా నూడ్పించుచుండవలెను. పల్లెలలో గ్రామము చుట్టును మలమూత్ర విసర్జనము చేయుదురు. ఇట్లు చేయుట పశువుల లక్షణము. గ్రామమునకు దూరముగా కాలకృత్యములు తీర్చవలెను.

౨. ఊరి లోపలను, ఇండ్లప్రక్కలలోను, దొడ్లలోను, పెరటిలోను, ఊరిముంగలిలోను, పెంటలు పెట్టుట గొప్పతప్పు. గ్రామమునకు దూరముగా పెంటల పెట్టవలెను.

౩. గ్రామములో గుంటలుండిన నీరు ఆగును. ఆ నీటిలో పురుగులు పుట్టును. ఆ నీటిపై దోమలు గుడ్లుపెట్టి పిల్లలవేయును. కావున గుంతలు పూడ్పించుడు. నీరు నాగనీయకుడు.

౪. సంవత్సరమునకు రెండు మారులు—ఉగాది కొకతూరి విజయదశమీ పండుగ కొకతూరి మీయిండ్లకు-మొత్తు వేయించి సున్నము పూత పూయించుము.

౫. ఇంటిలో ఎలుక బొఱ్ఱలను మూసి వేయుము. ఎలుకల చంపుడు. అట్లుచేయకుండిన ప్లేగు సంభవింప వచ్చును.

ఎలుకలనుండి ప్లేగును }
ఈగల నుండి కలరాయు } వచ్చును

౬. మీయింటిలో స్నానము జేసిన నీరు, వంట యింటిలోని నీరు, బయిటికి పోవునట్లుగా కాలువలు కట్టి వానిని దినము పరిశుభ్రము జేయించ వలెను.

౭. బావులలో స్నానము జేయకూడదు. బట్టలుదుకకూడదు. నాచునుండనీయకుము. పూడికయుండిన తీసివేయుము. ప్రతి సంవత్సరము చైత్ర మాసములో పోటాసియం పర్మాంగనేట్ అను మందును బావిలో కలుపుడు. ఇది మీ తాలూకా డాక్టరు గారిని విచారించిన సహై జేయగలరు.

# ఆరోగ్యము

ఆరోగ్యము లేనివాడు జీవచ్ఛవము (అనగా చచ్చినవానితో సమానము)

జాడ్యము లనేకములు అన్నింటికి మందులు వ్రాయుట నావనికాదు. సాధారణముగా గ్రామమంతటికి సంబంధించిన జాడ్యములను గురించి రెండు మాటలు చెప్పెదను. సాధారణ ముగా ప్రతిగ్రామములో ఈ క్రింది జాడ్యములు విశేషముగా వ్యాపించి కొని పోవును.

౧. అమ్మతల్లి (స్ఫోటకము)
౨. కలరా.
౩. నారి.
౪. మలేరియా, చలిజ్వరము.
౫. బాలెంత జాడ్యములు.

వీని నివారించు టెట్లు?

ముందు చూడుడు

# స్ఫోటకము

నీ కొడుకు ముఖము మచ్చలుకలిగి వికారమగుటయు గ్రుడ్డి వాడగుటయు నీకిష్టమా? లేక టీకాలుతీయించుట నీకిష్టమా? "అమ్మ" పోయుట అనునది జాడ్యము. అది దేవర కాదు! ఎన్నటికి కాదు!!

ఈ "అమ్మ" వలన వేనవేల పిల్లలు ఏటేట చచ్చుచున్నారు తల్లులకు దుఃఖము పెట్టి పోవుచున్నారు.

చావని పిల్లలకు ముఖము చెడిపోవును. కండ్లుపోవును. బలహీనులగుదురు.

దీనికి మందు

టీకాలు తీయుటయే!

టీకాలుతీయువారు మీ గ్రామమునకు వచ్చిన మీ పిల్లల కుండల చాపున చీకటిగదులలో దాచిపెట్టకుడు! అట్లుచేసిన తర్వాత యేడ్చుట నిజము!

# కలరా

మా ఊరికి ముంచిపోయిన కలరా వ్యాధి.

ఇది తెలియక మారెమ్మ దేవర చంపునని జనులనుకొందురు.
కలరా రాకుండుటకు మార్గములు.

(౧) నీరు కాచి త్రాగుము.

(౨) ఇల్లు శుభ్రముగానుంచి దినమును అలికికొనుము.
[3] అన్నముపై ఈగల వ్రాల నీయకుము.

(౪) జాడ్యస్థుల దగ్గరకు పోయివచ్చి తర్వాత బట్టలు తడిపి యుదుకుము. నీవు స్నానము చేయుము.

(౫) జాడ్యస్థులు వాంతి భేదులు చేసికొనిన యా మలినములను వెంటనే యెత్తివేయుము. ఆ స్థలమును ఫినాయిల్‌తో కడుగుము.

(౬) ఈ జాడ్యమునకు చికిత్సచేయు డాక్టరులను పిలువుము. కావలసిన మందులు ఇప్పించికొనుము.

(౭) నీ వుపయోగించు నీటిలో పొటా సియము పర్మాంగనేటు కలుపుము. ఈమందు కలిపిన నీరుకలరా రోగికివ్వుము.

(౮) దీనిని గురించి తెనుగులో గ్రంథము వ్రాసియున్నారు. తెప్పించి కొని చదువుము. నీభార్యనుగూడ చదువు మనుము. చదువురాకుండిన నీవే చదివి వినిపించుము.



## నం ౮

బావులలో ఎండకాలములో నారి పురుగు లుండును. అవి కంటికి కనబడవు. ఆపురుగులతో గూడిన నీటిని మనము త్రాగినట్లైన కొన్ని దినముల కా పురుగులు శరీరములో వృద్ధి పొంది బయటకు వచ్చును.

నారిపుండ్లవలన లాభము లేమనగా:—

౧. కాళ్లుపోయి కుంటివారగుట.

౨. నెలల పర్యంతము బాధపడుట.

౩. దుర్బలు లగుట.

నారులు కాకుండుటకై యొకటిమందు నీటినెల్లప్పటికి
కాచి చల్లారిన తర్వాత త్రాగుట.
ఇంతమాత్రము ఓపిక మీకు లేదు

కాని

నెలలకొలది అమ్మా అబ్బా అని మూల్గుచు, దేకుచు, కుంటుచు, బాధపడుటకు మీ కిష్టము నొందు!

మీకేది యిష్టము?

# మలేరియా

దీనినే చలిజ్వరమందురు.

ఇది దోమలు కఱచుటచే సంభవించును.

దీనికి మందులు; ...

(౧) దోమలను నాశనము చేయుట. దోమలు బజారులలో నాగిన నీటిపై ఆగును. గుడ్లు పెట్టును. అచ్చటనే వృద్ధియగును. కావున నీరు ఆగకుండునట్లుగా చేయుము.

[౨] కాలువలపై అప్పుడప్పుడు కిరసనాయల్ నూనెను చల్లుడు. అది నీటిపై విచ్చుకొని పోవును. దోమల గుడ్లు నాశనమగును.

[3] దోమ తెరలను కొని వాటిలో పండుకొనవలెను. దోమ తెర ఖరీదు ఆరేడు రూపాయీలుండును.

[౪] క్వైనాపొడి ప్రతి యింటను నుంచుకొని చలిజ్వరము వచ్చినవారి కియ్యవలెను.

ఇంతమాత్రము ద్రవ్యమెక్కడిది అందురు

కాని

డాక్టరుగారికి దినము ౧ రూపాయి మందుకిత్తురు.
కల్లుత్రాగువారు నెలకు ౧౦ రూపాయిలు కర్చుచేతురు.



# బాలెంతజాడ్యములు

బాలెంత రాండ్రకు గాలి యుండవలెను. వెలుతురుండవలెను. పరిశుభ్ర వస్త్రములు కట్టించవలెను. ఇవన్నియు మీరు చేయరు. అందుచే బాలెంతలకు శీఘ్రముగా క్షయ వ్యాధులు ప్రారంభమగును. శిశువులు పురిటిలోనే గంతు కొట్టుదురు. అట్లు కాకున్న సదా రోగపీడితులుగా నుందురు.

## కావున

మీ భార్యలు, మీ పిల్లలు ఆరోగ్యముగా నుండ గోరిన బాలెంత రాండ్రకు మంచి గాలి, మంచి వెలుతురు మంచి పరిశుభ్రమైన వస్త్రములు, మంచితిండి దొరకునట్లు చేయుడు.

అట్లు చేయకున్న మీరు పశ్చాత్తాప పడుదురు.

మీ గ్రామములో నొక వితంతువునకు మీరు ద్రవ్యమిచ్చి సర్కారీ వైద్యశాలలో మంత్రసాని పని నేర్పింపరాదా? మంచి మంత్రసానిని వైద్యశాలలో తయారు అయిన దానిని పిలిపించుడు. అవసరముండిన వైద్యురాలితో పరీక్ష చేయించుడు. లేదా మీ కాలక్షేపణము లేకున్న సర్కారీ జజ్జీఖానాలో మీ గర్భిణీ స్త్రీలనుంచుడు.

# శిశుపోషణ

మీ శిశువు లారోగ్యముగా నుండవలెననిన నీ క్రిందివి గమనింపుడు.

(౧) తల్లికి మంచి ఆహార మియ్యవలెను.

(౨) తెలివి లేనట్టియు మురికిగానున్నట్టియు మంత్రసానిని దగ్గరకు రానీయ కూడదు. వైద్యశాలలో తరబీయతైన మంత్రసానులు దొరకుదురు. వారిని పిలిపించవలెను.

(3) శిశువునకు సకాలమున అనగా మూడు గంటలకొకతూరి పాలియ్య వలెను.

(౪) చనుబాలకన్న మించిన యాహారము పిల్లలకు దొరకదు.

(౫) తల్లిపాలు లేకున్న మంచి ఆవుపాల నియ్యవలెను.

(౬) శిశువునకు గాలి వెలుతురు తగులునట్లుంచ వలెను.

(౭) శిశువును కోర్చునంతటి యుష్ణోదకముతో ప్రతిదినము స్నానము చేయించి పరిశుభ్రమగు బట్టలపై పరుండ

బెట్టువలెను, అనేకుల యిండ్లలో బొంతలపై పిల్లలను పండ బెట్టెదరు. ఇదిగొప్ప తప్పు బొంతలలో శిశువుల మల మూత్రములు చేరి యెంతకడిగినను కొంతనిలిచి దుర్వాసన కలిగి క్రిములుత్పత్తియగును. కావున బొంతలు వాడకుడు. పాతబట్టలు వాడకుడు.



ఈగలు.

చూచుటకు చిన్నవి. కాని వీనిమూలమున మన దేశములో ప్రతిసంవత్సరము వేలకొలది చచ్చుచున్నారు. ఈగలు మన యిండ్లచుట్టునుండు మలినముపై కూర్చుని తమ కాళ్లకా మలినమంటించి కొనివచ్చి మనము తిను యన్నముపై వాలి యందా మలినము కలుపును. మనకిది కనపడ నందున నట్లే తిందుము. పిమ్మట అనుభవింతుము.

ఈగల యుత్పత్తిస్థానములు

(౧) పాయఖానాలు

(౨) పశువులదొడ్లు - పెంటలు

(౩) మురికి కుప్పలు

అనగా ఈ యీగలు

మురికిలో పుట్టును

మురికినే తినును

మురికిలో పెరుగును.

ఈముతికి మనభోజన పదార్థములపై ముపుటచేత కలరా, ఉదరరోగములు సంభవించును.

ఈగలను నాశనముచేయుటెట్లు?

౧. గృహములను పరిశుభ్రముగ నుంచుము.

౨. భోజనపదార్థముల మూసియుంచుము

౩. ఈగలను జంపు కాగితములు (Tange-fsst, అను కాగిదములు) అమ్మెదరు. వాని నింటిలో పెట్టిన ఈగలు కుప్పకుప్పలుగా చచ్చును.

ఈగలు——ము తికియొక్క సంతానము.

# బావులు.

బావులలోని నీరు చెడిపోవుటకు కారణములు

౧. వానిదగ్గఱ పెంటలు మురికిదిబ్బలు ఉంచుట.

౨. వానిచుట్టును గోడలులేనందుచే మురికి యంతయు వాన వలన గాలివలన లోనికి కొట్టుకొని వచ్చుట.

3. బట్ట లుదుకుట. స్నానము చేయుట.

బావిలోని నీటిని పరిశుభ్రముగా త్రాగుటకు యోగ్యముగా చేయువిధములు;—

౧. చుట్టునుండు పెంటలు తీసి వేయుడు.

౨. బట్ట లుదుకకుడు. స్నానము బావిలో చేయకుడు.

3. ప్రతిసంవత్సర మొకతూరి పోటాసియం పరిమాంగనేటు అను నౌషధము కలుపుడు.

౪. నాచు ఉండిన తీసివేయుడు.

౫. వీలున్నంతవఱకు చేదుడుబావులు శ్రేష్ఠముగా నుండును.

౬. అంతకన్న వీలుండిన పంపొకటి పెట్టింపుడు.

# తోటపని

పూర్వ కాలము ప్రతియింటిలో నొక పెరడు (దొడ్డి) అందు పూలచెట్లు కొన్ని ఫలవృక్షములు పెంచు వాడుకగా నుండెను. ఇప్పుడా యాచారము పోయినది.

(౧) మీయింటిదొడ్డిలో మురికికుప్పలు నుగ్గుల కుచ్చెలు పెట్టి ఈగలు, దోమలు, పురుగులు వృద్ధియై కంపుకొట్టుచు మీకును మీపిల్లలకును ఆయుక్షీణము గలిగించుచున్నవి.

(౨) ఇది చెడ్డది. ఇందుకు మారుగా మీయింటి పెరటిలో మంచి పూలచెట్లు ఫలవృక్షములు పెంచుము మరియు కూరగాయలు వేయుము.

| | |
|---|---|
| పూలు | నుగ్గులు |
| ఫలములు | ముత్రః |
| కూరగాయలు | పెంటలు |
| వీనివలన మీకు | వీనివలన మీకు |
| పైకము | కలరా |
| ఆరోగ్యము | జాడ్యము |
| ఆనందము | దుఃఖము |
| లభించును. | సమకూరును. |

మీకేది యిష్టము తెలుపుడు.

# గ్రంథాలయములు

ప్రతిగ్రామమునందును నొక గ్రంథాలయము ఒక వాచనాలయమును స్థాపించుడు.

౨. మీకీవిషయములో సహాయము కావలయుననిన ఆంధ్ర జనకేంద్రసంఘ కార్యదర్శిగారికి వ్రాసి తెలిసికొనుడు.

౩. ప్రతిదినము సాయంకాలము గ్రంథాలయములో కూడి గ్రంథములు చదువుటలోను పత్రికలు చదువుటలోను కాలమును వినియోగించుడు, సాధారణముగా గ్రామస్థులు సాయంకాలమందు వ్యర్థము మాటలతో ప్రొద్దుపుచ్చుదురు. అందుకుమారుగా సత్కాలక్షేపము గ్రంథాలయములలో జరుగును.

౪. ప్రతివిద్యావంతుడును విద్యరానివారికి పత్రికల చదివి వినిపించి బోధచేయవలెను.

౫. ప్రతి ధనవంతుడును చందాలియ్యవలెను లేక గ్రంథములు మంచివి తెప్పించి తమపేర గ్రామగ్రంథాలయమునకు బహుమతిగా నియ్యవలెను.

౬. గ్రంథాలయములకును పార్టీలకు సంబంధము ఉండకూడదు. అందఱును సమానాభిమానము కలిగియుండవలెను.

గ్రంథాలయ వాచనాలయస్థాపకులు సరస్వతీదేవ్యుపాసకులు.



# సప్తసంతానములు

మీ ద్రవ్యమును వృథావ్యయము చేయకుడు.
మీకు నిజముగా కీర్తి కావలయునన, పుణ్యము కావలయు ననిన నీ క్రింది వానికి సహాయము చేయుడు.

(౧) గ్రామ పాఠశాలలు
(౨) గ్రామ గ్రంథాలయములు.
(౩) గ్రామ పంచాయతీ సభలు. (వర్తక, రైతు సంఘములు)
(౪) గ్రామ వైద్యాలయములు.
(౫) అనాథ శరణాలయములు.
(౬) గృహ పరిశ్రమలు.
(౭) గృహారామములు.

ఈ సప్తసంతానముల ప్రతి గ్రామమందును మీరు వృద్ధి పరచినట్లయిన.

(౧) మిమ్మెవ్వరును పీడించరు.
(౨) మీకే రోగములు నుండవు.

(౩) మీ ద్రవ్యము వకీళ్లకును, కచ్చేరీలకు, లంచములకును, వ్యర్థముగా ఖర్చుకాదు.

(౪) మీలో ఐకమత్యము ప్రబలును.

(౫) మీకు గౌరవము కలుగును.

(౬) మీనుండి దారిద్ర్యదేవత పారిపోవును.

(౭) మీ రానందముతో సదా కూడియుం[illegible]గు.



# పంచాయతీ సభలు

(౧) మీ గ్రామములో మీకు విశ్వాసపాత్రులుగా న్యాయస్థులుగా, సజ్జనులుగా, గనబడు పెద్దలను ముగ్గురినిగాని అయిదుగురినిగాని పంచాయతీ పెద్దలనుగా నేర్పాటు చేసికొనుడు.

(౨) మీలో వివాదము లేమి వచ్చినను ఆపెద్దల తీర్మానము ప్రకారము నడచుకొనుడు.

(౩) ఈ పంచాయతీ పెద్దలు వారమునకో పక్షమునకో యొకతూరి సమావేశమై తీర్పు చేయవలెను.

ఈప్రకారము మీ రేర్పాటు చేసికొనినట్లయిన

(౧) మీరు వృద్ధికివత్తురు.

(౨) మీకు ద్రవ్యనష్టము కలుగదు.

(3) మీలో పార్టీలు చూసిపోయి ఐకమత్యము వృద్ధియగును.

(౪) మిమ్ముల నెవ్వరును హింసింపజాలరు.

పంచాయతీ సభలే మీకు కల్పవృక్షములు పంచాయతీ సభలే మీకు కామధేనువులు.

# మత్తు పదార్థములు

మీ గ్రామములో నూటికి ౮౦ వంతున జనులు కల్లు త్రాగుదురు. మరికొందరు నల్లమందు బ్రాండీ, సారాయి, భంగీ మున్నగు మత్తువస్తువులు వాడుదురు. ఇది చాల తప్పు.

త్రాగుటవలన లాభములు —

(౧) శరీరము చెడుట. కార్యము చెడిపోవును.

మెదడు చెడిపోవును రక్తము చెడిపోవును.

(౨) చేజిడ్డు వదలుట-ధనికులైనవారు దీనిమూలమున దరిద్రులగుదురు.

(౩) గౌరవము పోవుట-మతియుండినప్పుడే మనుష్యుడు గౌరవము పొందుట కష్టము, మతితప్పిన తర్వాత యేడుగవలసిన దేమున్నది.

కల్లుద్రాగుటను విడుటయెట్లు ?

(౧) వెంటనే ఒట్టుపెట్టుకొని పూర్తిగా మానివేయుము.

(౨) మీపిల్లలకు బాగుగా బోధచేసి మద్యపానముయొక్క స్పర్శయే లేకుండచేయుడు.

(3) త్రాగువారి సహవాసము తత్క్షణమే వదలివేయుడు.

(౪) అభ్యాసముండువారు త్రాగు పొద్దయినప్పుడు కల్లుపై బుద్ధిపోయిన పాలు పండ్లు కొనితినుడు.

త్రాగుబోతులు—దున్నపోతులు రెంటిలో భేదములేదు.



## సహకారము:

దాని లాభములు:—

౧. మితివ్యయము అలవాటగును.
౨. సావుకారుల బాధ తప్పును.
3. మీ అవసరములు తీరుటయే గాక కొంతకాలమునకు మీకు అప్పు అవసరముండదు.

౪. సౌభ్రాతృత్వము, ఐకమత్యము, కలుగును.
౫. కోర్టుల కెక్కుటయును, దావాలును తప్పును.
౬. మీరు పండించు ధాన్యములకును, చేయు వస్తువులకును తగిన విలువ లభించును.

౭. మీ దారిద్ర్యము తొలగును.
౮. మీకు కావలసిన సామగ్రి తక్కువధరలకు దొరుకును.

సహకారము—సౌభ్రాతృత్వము

ప్రతివ్యక్తి సంఘముకొరకు,
సంఘము ప్రతివ్యక్తి కొరకు

దక్షిణ హైద్రాబాదు

# గోలకొండ పత్రికా ప్రచురములు

| | | |
|---|---|---|
| ౧. | రెడ్డికులనిర్ణయచంద్రిక. | ౧-౪-౦ |
| ౨. | సంఘోద్ధరణము | ౦-౮-౦ |
| ౩. | గయోపాఖ్యానము ద్విపద-ప్రాచీనకవిది | ౦-౬-౦ |
| ౪. | భారతీయస్త్రీధర్మములు. | ౦-౪-౦ |
| ౫. | పంచములచరిత్ర. | ౦-౪-౦ |
| ౬. | గోలకొండసంచిక ౧౧౦ పుటలు.౪౦ చిత్రపటములు. నగమువెల. | ౦-౪-౦ |
| ౭. | కర్నూలురాజులవంశావళి. | ౦-౨-౦ |
| ౮. | కృష్ణాలహరి, పారాయణగ్రంథము. | ౦-[illegible]-౦ |
| ౯. | చార్మినారు సచిత్రము | ౦-౨-౦ |

# గోలకొండ ముద్రాక్షరశాల

## హైదరాబాదు.

---

పలువిధములగు అచ్చుపనులు తెనుగు, ఇంగ్లీషు, ఉర్దూ భాషలలో సిద్ధము చేయబడును. ఆర్డర్లు సకాలమునకు పూర్తి చేసి యివ్వబడును.

మేనేజరు
గోలకొండ పవర్ ప్రెస్,
హైదరాబాదు దక్కన్

